773

# పతివ్రతాధర్మములు.



[పాతివ్రత్య ధర్మములను గూర్చి వాత్స్యాయనుఁడీ క్రిందఁజెప్పినరీతిని వ్రాసినాఁడు. అతఁడు ఇప్పటికి రెండు వేల సంవత్సరములకుఁ బ్రిందటివాఁడనఁగా క్రీస్తుశకమునకు పూర్వపువాఁడయినట్లు కాన్పించుచున్నది.]

1. తనభర్తకే పత్నియయినకాంత యాతని నమ్మకమును సంపాదించి దైవమునుఁబోలె నాతనిం బూజింపఁదగును.

2. అత డంగీకరించినని, గృహకృత్యభార మంతయు నామెయే వహింపఁదగును.

3. ఇంటిని చక్కఁగాఁ గడిగి, తుడిచి, పరిశుద్ధముగా నుంచి, దానియందంతటను పూవుల నలంకరింపఁదగును. నట్టింటిని నున్నఁగానుంచఁదగును. ఇంటి దేవరపట్టు ఉదయ మధ్యాహ్న సాయంకాలములందు కడిగి, దేవతార్చన మునకు అవసరమైన పూజలఁ జేయఁదగును. ఇది యే పురుషునకు హృద్యమయిన కార్యము.

4. తనభర్తయొక్క తల్లిదండ్రులను, అతని యింటిసే వకులను, అతని సోదరీలను వారల భర్తలను సత్కార

వృషముచే సంభాషింపఁదగును

5. భిక్షువులు (శ్రమణులు, శ్రవణులు అనువారాడు జాతుల యోగినీ స్త్రీలతోఁగాని, జాతిబహిష్కృతలయిన స్త్రీలతోఁగాని, సాముద్రికము, జ్యోతిషము లేక ఎఱుకచెప్పు స్త్రీలతోఁ గాని, ఔషధులతో గారడిచేయు స్త్రీలతోఁగాని యామె సంభాషింపఁదగదు.

6. యోగినులు సాధారణముగా, జారత్వసంఘటము నకు నియోగింపఁ బడుదురు గనుక వారికట్టి యపఖ్యాతి వచ్చినది.

7. ఆహారవిషయమయి తనభర్తకు ఇష్టమైన దేవిరొలా,

దగదు.

11. అతఁడు సద్వ్యయము చేయునపుడు గాని, దుర్వ్యయము చేయునపుడు గాని, యావిషయము రహస్యముగ నాతనికి బోధింపఁదగును.

12. ఆతని యనుమతి లేకుండ, పెండ్లికొడుకు నింటి కయినను పెండ్లికూఁతు నింటికయినను వివాహమునకుఁ గాని, ఏదేని యుత్సవమునకుఁగాని, తనస్నేహితు రాండ్ర తోఁగాని విందు భోజనమునకుఁ గాని, దేవాలయమునకుఁ గాని, వెడలఁ దగదు.

13. అతని హృదయమున కాహ్లాదము గలిగించు విశో

దములను మాత్రమే యామె యనుభవింపఁ దగును.

14. అతఁడు శయ్యఁజేరిన పిమ్మటఁ దాను శయ్యం జేరి యాతనికంటె ముందుగా బ్రక్కనుండి లేవఁదగును. అతఁడు పగటి నిద్రించుచుండెనేని యెన్నఁడును మేల్కొలుపరాదు.

15. వంటశాలను సహాన్యముగాను, ఎండచొరుదానిగాను, ఉంచఁదగును.

16. అతఁడన్యాసక్తుండయి తనపట్ల దోషమాచరించెనేని కొంచె మాగ్రహించి యాతని నిందింపవచ్చును. కాని, హెచ్చుగాఁగాదు.

.7. అతని ఎత్తి పొడుపుమాటలాడవలసి వచ్చెనేని,

అతనితో స్నేహితులు మాత్రమే యున్నప్పుడుగానిఁ లేక యాతఁడొంటరిగా మాత్రమే యున్నపుడుగాని, అట్టిమాట లాడవచ్చును. మాదులు మాయలుఁ బ్రయోగించి యాతని మనసు వశముచేసికొనుట కెన్నఁడును బ్రయత్నింపఁ దగదు.

18. కోపసంభాషణము, కోపదృష్టి, పరాఙ్ముఖయయి మాటలాడుట, తలవాకిట నిలుచుండి వీధివైపునకుఁ జూచుట, సేవసేవ్యస్థలాంతరముండుట,—ఇట్టికృత్యములనామె వర్జింపఁదగును,

19. ఆమె సర్వదా సుందరముగాను, శుచిగాను,

కట్టసామానులు, తోలువస్తువులు, వీనిని ఆమె వేరుచేసి కొనవలయును.

23. అగ్ని, యుప్పు, చమురు, అపరూప మయిన ఔషధులు వీనినామె జాగ్రతచేసి యుండఁదగును,

24. ఆమె తనద్రవ్యస్థితిని గాని, తనభర్త చేయు నుపదేశమును గాని, ఇతరు లెవ్వరికిని చెప్పఁదగదు.

25. ఆమె వస్త్రధారణమందును, వంటచేయుటయందును, యశస్సంపాదనమందును, భర్తృసేవయందును, తన తోడిచేడియలకంటె నధికురాలగుటకామె యత్నింపఁదగును.

26. ఆమె తన కుటుంబమునకు సంవత్సరమునకువచ్చు

నాదాయము లెక్కించుకొని, యందుమీఁద వ్యయమును నిర్ణయించుకొనఁ దగును.

27. భోజనమునందు వ్యయముగాఁగా మిగిలెడు పాలతో నాము నేయి చేయఁదగును. అట్లే మిగిలెడు చమురును పంచదారను జాగ్రత చేయఁ దగును. ఆమె దూది నాడెఁ ఆనూలితో బట్టనేయఁదగును. అవసరమయిన వరువులు (త్రాళ్ళు మొదలగువానిని, వల్కములను, చౌకగా దొరికినపుడామె కొనఁదగును. వడ్లుదంపించి బియ్యము చేసి, నూకలు లేవుడు యుక్తరీతి నుపయోగింపఁ దగును. ఆమె సేవకుల జీతబత్తెములను లెక్కించఁదగును. పాలవుల

దున్నింగట యుంగాను, పశుపాలనమందును, అశ్వశాలా విమర్శన మందును జాగరూకురాలయి యుండదగును. మఱియుఁ గోడిపుంజులు, పూరేడులు, చిలుకలు, కోకిలలు, నెమళ్ళు, కోఁతులు, తేళ్ళు, లోనగు పెంపుడుజంతువులయెడను గూర్చి ప్రతిదినము నామె శ్రద్ధవుచ్చుకొనఁదగును. ప్రతి దినము ఆమె లెక్కపరిచూచు చుండఁదగును.

28. తనభర్తయొక్క ప్రాఁతబట్టల నాపెఁ దాచి యవసరమయినపుడు అర్హులయిన సేవకులకును, భిక్షులకును, ఈయఁదగును.

29. తన భర్తయొక్క స్నేహితుల నర్ఘ్యపాద్యాది

నలంకారముల చేతను, పుష్పమాలికల చేతను, అభ్యంగ స్నానము చేతను, తాంబూల దానముచేతను భావింప దగును. తన యత్తమామలను సేవించి, వారియాజ్ఞలను నిర్వర్తించి, వారి మందలింపులను సహించి, వారియెదుట మెల్లగా మితముగాం భాషించుచుండదగును. బిగ్గరగా నవ్వ దగదు. తనభర్త యొక్క స్నేహితులనే తనస్నేహితులను గాను, అతని శత్రులనే తన శత్రువులనుగాను భావింప దగును. ఆమె వినోదముకై ప్రయత్నింప దగదు. తన సేవకులపట్ల నాదరముగలదై యుండునది. తనభర్తకుచెప్ప కుండ నెవ్వానికిని, ఆమె యేవస్తుదానమును జేయదగదు.

